4వ కూర్పు వరకు — 12,000
1981 — 2000
మొత్తం — 14,000

కామక్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠన్తి తస్కరాః
జ్ఞానరత్నాపహారాయ
తస్మాజ్జాగ్రత! జాగ్రత

ఓ జనులారా! కామము, క్రోధము, లోభము అను దొంగలు దేహమునందు నివసించుచు జ్ఞానమను రత్నమును అపహరించుచున్నారు, కాబట్టి మేలుకొనుడు! జాగరూకత వహించి ఆ దొంగలను బయటకు తరిమివేసి పరమశాంతిని పొందుడు!

* * *

ఫ్రీడమ్ ప్రెస్, మద్రాసు-600 021.

# అధ్యాత్మ జడ్జిమెంటు






శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి

1981 [ వెల : రు. 1-00

సత్యాభిసంధానరతో విముక్తో
మహత్త్వమాత్మీయముపైతి నిత్యమ్
మిథ్యాభిసంధానరతస్తు నశ్యే
ద్దృష్టం తదేతద్యదచోరచోరయోః.

(వివేకచూడామణి)



సత్యమగు ఆత్మను ఆశ్రయించువాడు బంధవిముక్తుడై మహత్తరమగు శ్రేయమును సదా పడయుచుండును. మిథ్యయగు దేహాదిదృశ్యమును ఆశ్రయించువాడు వినాశమును, దుఃఖమును పొందును. లోకములో దొంగ కానివాడు సుఖమును, దొంగయగువాడు దుఃఖమును పొందుచుండుట కానంబడుచున్నది గదా!

ఓమ్

# తొలిపలుకు

ప్రతిజీవియొక్క హృదయమందును ధర్మాధర్మములకు, న్యాయాన్యాయములకు, సత్యాసత్యములకు, ఆత్మానాత్మలకు పెద్దపోరు జరుగుచుండును. అందును ముముక్షువుయొక్క హృదయమందు ఈ పోరు అతి తీవ్రముగ నుండును. ప్రతిపక్షస్థానమందున్న మాయ పరమార్థక్షేత్రమున పురోగతినొందుచున్న సాధకుని పడగొట్టుటకై ఎన్నియో పన్నాగములు పన్నుచుండును. అత్యంత ధైర్యోపేతమైన బుద్ధిమాత్రమే ఈ సంగ్రామమున విజయము గాంచగలదు. జీవుని హృదయాంతరాళమున అహర్నిశము జరుగుచుండు ఈ ఆత్మానాత్మల సంఘర్షణ ఈ గ్రంథమున అత్యంత మనోరంజకముగ వర్ణింపబడినది. సద్గురువను జడ్జి యొక్క సాన్నిధ్యమున వాదియగు ముముక్షువునకు, ప్రతివాదులగు కామాదులకు జరిగిన వాదవివాదములు, పూర్వపక్ష ప్రతిపక్ష ప్రకటనలు ఇందు మనోహరముగ చిత్రింపబడినవి.

తుదకు జడ్జిగారియొక్క తీర్పున్ను వివరింపబడినది. అధ్యాత్మక్షేత్రమున పురోగమించు సాధకులకు ఈ గ్రంథము చక్కగ ఉపకరించగలదు. అభ్యంతర ప్రతిపక్షశక్తులపై విజయమును సాధించుటయందు దత్తచిత్తులగు ముముక్షువులకు ఈ చిన్నపొత్తము లెస్సగ తోడ్పడగలదని విశ్వసించుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు



# అధ్యాత్మ జడ్జిమెంటు

## కోర్టు - పరమార్థక్షేత్రము

జడ్జి:- సద్గురువు.

వాది:- ముముక్షువగు జీవుడు.

వాది వకీలు:- అతిసూక్ష్మగ్రాహియగు సాత్త్వికబుద్ధి.

వాది సాక్షులు:- (1) వివేకము (2) వైరాగ్యము (3) శమము (4) దమము (5) ఉపరతి (6) తితీక్ష (7) శ్రద్ధ (8) సమాధానము (9) విశ్వాసము.

వాది తరపు దస్తావేజులు—నాలుగు వేదములు, అద్వైత శాస్త్రములు మున్నగునవి.

ప్రతివాదులు:- అజ్ఞానము, కామ్యకర్మ.

ప్రతివాదుల వకీలు:- ఘోరమూఢబుద్ధి.

ప్రతివాదుల సాక్షులు:- (1) ధనాత్మ (2) కళత్రాత్మ (3) పుత్రాత్మ (4) దేహాత్మ (5) ప్రాణాత్మ (6) మనోమయాత్మ (7) విజ్ఞానమయకోశాత్మ (8) ఆనందమయకోశాత్మ (9) శూన్యాత్మ.

ప్రతివాదుల రికార్డులు :- ఇహలోక, పరలోక కాముకులైన పూర్వీకుల వాడుక ప్రకారము వ్రాయబడి యుండిన పాత చిఠా.

జీవుడు చిన్మయపరమాత్మ స్వరూపుడు. అతడు మృణ్మయుడు కాడు, చిన్మయుడు. దేహము కాదు. దేహియగు ఆత్మ. కాని అజ్ఞానవశమున అనేక జన్మలయందు తాను దేహమనియే తలంచి నానాక్లేశములను బొందుచు ఏదియో సుకృతము వలన మానవజన్మను బడసి, పెద్దల సాంగత్యముచే తాను నిత్యశుద్ధబుద్ధముక్త పరమాత్మయేయని యెఱిగి అట్టి తన ఆత్మరూపసంపత్తిని, తన జన్మహక్కును తిరిగి సంపాదించు నిమిత్తము పరమార్థ క్షేత్రమను కోర్టులో దావావేసెను.

ముముక్షుత్వము గల్గి మోక్షాధికారియైన జీవుడు తాపత్రయముచే మిగుల వ్యథనొంది, దానినుండి తప్పించుకొనదలంచినవాడై, మఱియు ఆత్మలాభమను సొత్తును అరిషడ్వర్గమను చోరులనుండి స్వాధీనపఱచుకొను ఉద్దేశ్యము గల్గి, వాది ప్రతివాదులను, ఉభయకక్షుల సాక్షులను చక్కగ విచారించి తీర్మానించుటకు మిగుల సమర్థుడై నట్టియు, లంచము

శీయనట్టియు, సత్యసంధుడై యొప్పునట్టియు, నిష్పక్ష పాతియై, సూక్ష్మబుద్ధియుక్తుడై, పరమదయాళుడై, సాత్త్వి కుడై నట్టియు, పరమార్థ న్యాయస్థానాధిపతి యైనట్టియు సద్గురు సార్వభౌముని యెదుట తనకు న్యాయము గలుగునని మదిని దలంచి సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మమును సర్వ్వ లును నిరాక్షేపముగా ననుభవించులాగున చేయు నిమిత్తము వ్యాజ్యము వేసెను.

నవద్వారశోభితమగు దేహమను పట్టణమందు తురీ యంబను సింహాసనమం దారూఢుడై, సత్యజ్ఞానానంద సర్వ వ్యాపక జ్యోతిర్మయ స్వరూపుడైనట్టి సద్గురువను జడ్జిగారు కొలువుతీర్చియుండగా, అత్తఱి ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధి దైవికములను తాపత్రయములను బొందిన ముముక్షువగు జీవుడను వాది సూక్ష్మగ్రాహియగు సాత్త్విక బుద్ధియను న్యాయవాది (Vakil) మూలముగ ఈ క్రిందివిధమగు అర్జీ దాఖలు చేసెను.—

అనంత కల్యాణ గుణగణ శోభిత సమరస సన్మార్గ స్వతంత్ర చిన్మయస్వభావ సువిచారరూప పరమార్థ న్యాయ నిర్ణయస్థానాధిపతియగు పరిపూర్ణ పరబ్రహ్మస్వరూపాపరోక్ష సాక్షాత్కార సద్గురుచక్రవర్తియై వెలుంగు న్యాయాధిపతి (Judge) గారి సన్నిధానమునకు నిరపరాధియగు ముముక్షు వైన జీవుడను వాది శిరస్సాష్టాంగ నమస్కారము లాచరించి సమర్పించుకొనిన విజ్ఞప్తి యేమనగా—

అయ్యా! అరిషడ్వర్గసమేతుడగు అజ్ఞానమనువాడు బహుకాలము బాగుగ పొందియుండి తన ఆవరణశక్తిచే ఆత్మయొక్క అసంగత్వ లక్షణమును మఱుగుపఱచి "విక్షేపము"ను బంప, వానిచే గల్పింపబడిన వాసనలతో గూడిన పామరుడు కర్మఠుడు, మూఢభక్తుడను విరోధులు ఆ యాత్మ నాక్రమించి చెలరేగి తమ అనాత్మపదార్థములతో దానిని జేర్చుకొని తమతో గలసిపోవునట్లు వాని గలుగ జేసినారు. కావున అనాది అసంగస్వభావమైయుండునట్టి ఆత్మరూప శాశ్వత ధనమును ఇకముం దెన్నడును పైకనినవారు అప హరింపకుండునట్లును, మఱియు వారి దుర్వాదములను ఖండించి అజ్ఞానమనునది ఆత్మవస్తువును మరుగుపఱచిన మోసమును, ప్రజ్ఞానమును అపహరించిన చౌర్యమును, విక్షేపము మిథ్యా జగత్తును సృష్టించిన క్రౌర్యమునుగూర్చి నీతికోవిదులు న్యాయనిర్ణేతలునగు తాము దీర్ఘవిచారణ చేసి వారలను దండించుటయేకాక స్వయంప్రకాశమై సర్వవ్యాపకమైనట్టి ఆత్మయొక్క యాథార్థ్యమును సర్వులు నిరాటంకముగా ననుభవించి సుఖపడునట్లు చేయవలెనని ప్రార్థించుచున్నాను. ఇవ్విషయమును సమర్థించుటకు నా తరపున వివేక వైరాగ్యాది సాక్షులనేకులున్నారు. ఈ వివాదసంబంధమైన శాసనములగు ఉపనిషత్తులు, భగవద్గీత, అద్వైతశాస్త్రములు మున్నగువానిని ఈ నా అర్జీతోసహా జతపఱచి దాఖలు

చేసియున్నాను. కాబట్టి ధర్మనిర్ణేతలగు తాము కటాక్షించి నిష్పాక్షిక విచారణ సలిపి న్యాయంబొసంగ వేడుకొనుచున్నాను.

ఇట్లు
భవద్విధేయుడు,
(Sd.) ము ము క్షు వు.

ముముక్షువను వాది వివాదపత్రములో పొందుపరచిన ఉపనిషదాది ప్రమాణములను శోధించి సద్గురువను జడ్జి ప్రతివాదులకు ఈ క్రిందివిధముగు శాసనములను గావించెను.—

నిత్యశుద్ధబుద్ధముక్తమై వెలయు ఆత్మస్వరూపమును మీరును, మీతో జేరినవారును దురాక్రమణముగా సంగ్రహించి, మాయజేసి దుర్వినియోగము చేయుచున్నారనియు, అట్లుచేయుట న్యాయవిరుద్ధమనియు, ఎల్లప్రాణులకును ఆ యాత్మస్వరూపము జన్మహక్కనియు, దానిని సర్వులును అనుభవించులాగున తీర్పుచేయవలెననియు, ప్రతివాదులు చేసిన మోసము, చౌర్యము, క్రౌర్యము మున్నగు తప్పులకు వారలను దండించవలెననియు, ముముక్షువగు వాది మిమ్ములను ప్రతివాదులనుగా జూపి వివాదపత్రమును మాయొద్దకు పంపియుండుటచే ఈ శాసనమును జూచిన తత్క్షణమే మీరిచటికి తెంచి తగు సమాధానములను చెప్పవలెను. మీరు మీ సాక్షులతో సహా ఇచటికి రానియెడల మీ పరోక్షముననే

కేసు విధ్యుక్తముగ విచారించబడి తగురీతి తీర్మానించబడ గలదని న్యాయనిర్ణేతలు ఉత్తరువు కావించుచున్నారు.

[ఆ శాసనము అందగనే ప్రతివాదులు వెంటనే జడ్జిగారి సమ్ముఖమునకు వచ్చి ఈ క్రింది విధముగ విన్నపము గావించుకొనిరి—]

చిన్మయస్వరూప సువిచార వేదాంతోచిత పరమార్థ న్యాయ బ్రహ్మస్వరూపాపరోక్షసాక్షాత్కార సద్గురుప్రభువుగారి సన్నిధానమునకు ప్రతివాదులగు (1) అజ్ఞాని (2) పామరుడు (3) కర్మరుడు (4) మూఢభక్తుడు-అను మేము నలుగురము నమస్కరించి వ్రాసికొనిన విన్నపము ఏమనగా-ఈ వాదియొక్క వివాదవిషయిక విజ్ఞాపనము కేవలము అబద్ధము. అతడు కావించినదియంతయు ఉన్మత్త ప్రలాపము. ఆత్మరూప ధనము సర్వజన సామాన్యమైనది ఎప్పుడును కానేరదు. ఆ ప్రకారముగ అది అందఱికిని సొంతహక్కు, స్వతంత్రమైనది అనుట సర్వాబద్ధము. మే మొక్కొక్కరము అనాదిగా దానిని స్వాతంత్ర్యముతో అనుభవించుచున్నాము. కనుక ఫిర్యాది అగు వాది దాని ననుభవించుటకు అర్హుడు కాడు. మఱియు ఈ కేసులో వివాదాస్పదమైన ధనము అనాది కాలమునుండి, తాతల ముత్తాతల కాలమునుండి మా యనుభవములోనే యున్నది. దానికి గడువుమీఱుటవలన కాలదోషముపట్టి పోయినది. ఇక దానిని గుఱించి ప్రశ్నించుటకైనను వాదికి అర్హత లేదు. కాబట్టి దానిని మా యొద్దనుండి తీసి వాదికి

ఇచ్చుట యెంత మాత్రము తగదు. వివాద సొత్తును మేము అక్రమముగా తీసికొనినందున మమ్ములను దండించుట కేవలము అన్యాయమే యగును. కావున పైన దెలిపిన ధనాదులను మా యొద్దనే ఎప్పటివలెనుంచుటే కాక, వాదియొక్క వివాదమును త్రోసిపుచ్చి ఆ అన్యాయవివాదమువలన మాకు కలిగిన నష్టమునంతను వాది యిచ్చుకొనునట్లు తీర్పు చేయవలెనని గౌరవనీయులైన న్యాయాధిపతిగారిని (Honourable Judge) మఱి మఱి ప్రార్థించుచున్నాము.

ఇందులకు సాక్షులు—(1) ధనాత్మ (2) కళత్రాత్మ (3) పుత్రాత్మ (4) దేహాత్మ (5) ప్రాణాత్మ (6) మనోమయుడు (7) విజ్ఞానమయుడు (8) ఆనందమయుడు (9) శూన్యాత్మ. వీరికి తగిన ప్రమాణములకును, ఇహలోక కాముకులైన జనుల సంప్రదాయానుసారముగ వ్రాసియుంచిన లెక్కలను, పరలోక కాముకులైన పెద్దలనుష్ఠించిన కర్మకాండ రూప ప్రమాణములను, ఆగమ పురాణేతిహాస సంబంధములైన సిద్ధాంతములను క్లుప్తకాల మతిక్రమింపక పంపియున్నాము. కనుక ఆ రికార్డు అంతయు దేవరవారు పరికించి క్రమప్రకారము న్యాయముగ, ధర్మబద్ధముగ విచారించి, అనేకులు తీర్పుచేసినట్టి మా పక్షమునే స్థిరపఱచ ప్రార్థించుచున్నాము.

ఇట్లు విన్నవించు

అజ్ఞాని, పామరుడు, కర్మతుడు నమస్కారములు.

ప్రతివాది వకీలగు మూఢబుద్ధి చేవ్రాలు—

న్యాయాధిపతులైన సద్గురువుయొక్క సన్నిధానమందు వాది తెచ్చినవివాదమును, అందులకు ప్రతివాదులిచ్చిన సమాధాన పత్రములను చదివి కోర్టువారిచ్చిన ఇష్యూలేవనగా—

1. వివాదగ్రస్తమైన ఆత్మయను సొత్తు సర్వజన సామాన్యమైనదా? లేక, ఏ కొందఱియొక్క మాత్రమే స్వాధీనవస్తువా?

2. ఈ వాది నేరమును తెచ్చుటకు అర్హుడా, కాడా?

3. ఈ వివాదము కాలనిర్ణయ శాసనమునకు అనుగుణ్యముగా నున్నదా, లేదా?

4. వివాదాస్పదమగు ఆత్మయను సొత్తును అక్రమముగా దాచియుంచిన ప్రతివాదులు దండనార్హులా, కారా?

5. వాదికి వివాదధనమును తీసి ఇవ్వవచ్చునా, లేదా?

ఈ ప్రకారముగ కోర్టువారు ఐదు నిబంధనలను ప్రకటించి గడువుకాలమును ఏర్పాటుచేసిరి. గడువు పూర్తి కాగానే వాదిప్రతివాదులు తమ తమ సాక్షులతోగూడ న్యాయస్థానమునకు రాగా, మొట్టమొదట ప్రతివాదియొక్క సాక్షులను విచారించవలసినదిగా కోర్టువారు ఆదేశించిరి.—

# ప్రతిపక్షుల విచారణ

## 1 వ సాక్షియగు ధనాత్మవాది విచారణ

### (ధనమే ఆత్మయని వాదించువాని విచారణ)

కోర్టునందు సభ్యులందఱును నిశ్చలముగ గూర్చొనియుండ, ఇంతలో ఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలు లేచి ధనాత్మను 'నీ పేరేమి' అని యడిగి అతనిని కోర్టువారి ముందు నిలిపి 'సద్గురున్యాయాధీశుని యెదుట నిజము తప్ప అన్యమేదియు వచింపను' అని ప్రమాణము చేయించి ఇట్లు ప్రశ్నించెను—

ప్ర:- నీ వెవరు?

ఉ:- నేను ధనికుడను.

ప్ర:- ఆత్మను నీ వెఱుంగుదువా?

ఉ:- ధనమే ఆత్మ.

ప్ర:- ఇందులకు ప్రమాణము లేవైనకలవా?

ఉ:- కలవు. చెప్పెదను వినుము.

1. యస్యాస్తి విత్తం స నరః కులీన
స్స పండితస్స శ్రుతవాన్ గుణజ్ఞః
స ఏవ వక్తా స చ దర్శనీయ
స్సర్వే గుణాః కాంచనమాశ్రయన్తి.

ఎవనికి ధనము కలదో వాడే కులవంతుడు, పండితుడు, శ్రోత్రియుడు, గుణవంతుడు, వక్త. అతనినే దర్శింపవలెను. సుగుణములన్నియు ధనమునే ఆశ్రయించుచున్నవి.

2. వేదమూలమిదం బ్రాహ్మ్యం
భార్యామూలమిదం గృహమ్
కృషిమూలమిదం ధాన్యం
ధనమూలమిదం జగత్.

బ్రాహ్మణత్వమునకు మూలము వేదము. గృహమునకు మూలము భార్య. ధాన్యమునకు మూలము కృషి. జగత్తునకు మూలము ధనము.

ఈ మొదలైన ప్రమాణములనేకములు కలవు కావున ధనమే ఆత్మయగును.

ప్ర:- ధనమే ఆత్మయనుటకేదైన యుక్తి చెప్పగలవా?

ఉ:- లోకములో ధనము లేనివానిని తిరస్కరించి, ధనమున్న వానిని చూచినంతమాత్రమున అందఱును లేచి వందన మొనర్చి మర్యాద చేయుచున్నారుగదా! ఇంతకు మించిన యుక్తి మఱేమి కావలయును!

ప్ర:- ధనమే ఆత్మయనుటకు అనుభవమును చూపగలవా?

ఉ:- ధనమును చూచినపుడు, తాకినపుడు జను లానందభరితులై యుండుటయే ప్రత్యక్షానుభవము.

ఈ ప్రకారముగ ప్రమాణయుక్త్యనుభవములతో చెప్పిన ధనాత్మవాదిని జూచి వాది వకీలగు సూక్ష్మగ్రాహి యను సాత్త్వికాంశబుద్ధి వానిని ఈ క్రింది విధముగ క్రాసు పరీక్ష చేయుచున్నాడు.

## క్రా సు ప రీ క్ష

ప్ర :- నీవు ధనమే నేనని చెప్పుచున్నావా, లేక ధనము నాదని చెప్పుచున్నావా? నీ వింతవఱకు చెప్పిన వాక్యము లన్నియు అవివేకములును, తత్త్వశాస్త్ర పరిజ్ఞానశూన్యములును, అనుభవరహితులు నగు లౌకికులు చెప్పినవే యగును. అయ్యవి తత్త్వశాస్త్రకోవిదులును, అనుభవజ్ఞులునగు పారమార్థికులకు అంగీకారయోగ్యములు కానేరవు. నీవు చెప్పిన యుక్తులను, వాదములను నేనిపుడు చక్కని ప్రమాణములచే, తర్కముచే పటాపంచలు చేయగలను. ఎట్లనగా శాస్త్రవాక్యములను వినుము-

1. అర్థానామార్జనే దుఃఖమార్జితానాం తు రక్షణే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం కిమర్థం దుఃఖభాజనమ్.

ధనమును ఆర్జించుట కష్టము. ఆర్జించినదానిని రక్షించుట కష్టము. అది నశించినపుడు ఇంకను కష్టము. కావున ఇట్టి దుఃఖప్రదమగు ధనమువలన ఏమి ప్రయోజనము?

2. మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః.

తల్లికి, కుమారునికి మధ్యకూడ విరోధమును తెచ్చి పెట్టు ధనమునకు ఒక నమస్కారము!

3. ధనమెచ్చిన మదమెచ్చును
మదమెచ్చిన దుర్గుణంబు మానక హెచ్చున్
ధనముడిగిన మదముడుగును
మదముడిగిన దుర్గుణంబు మానును వేమా.

ఆవు పెరిగినచో ఆవు కొమ్ములును పెరుగునట్లు ధనము హెచ్చిన కొలది తృష్ణ (ఆశ) యు అధికమగును.

ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసంచయాన్.
(భగవద్గీత)

అవివేకులు, అసురసంపదకలవారు ఆశాపాశములచే బద్ధులై, కామక్రోధపరాయణులై కామభోగముకొఱకు అన్యాయముగ ధనమును సంపాదించుచుందురు.

అర్థమనర్థం భావయ నిత్యం
నాస్తి తతస్సుఖలేశస్సత్యం
పుత్రాదపి ధనభాజాం భీతి
స్సర్వత్రైషా విహితా రీతిః.

—శంకరాచార్యులు.

ధనము అనర్థమును గలుగజేయుననియు, దానివలన లేశమైనను వాస్తవముగ సుఖములేదనియు, సొంతకుమారుని జూచినను ధనవంతునకు భయమే కలుగుననియు, సర్వత్ర ఇట్టి యనుభవమే కలుగుచున్నదనియు సదా జ్ఞప్తియందుంచు కొనుము. కావున ఈ ప్రకారముగ పారమార్థిక సుఖవివర్జిత మైనట్టి ధనము నిత్యానందదాయకమగు ఆత్మయని నీ వెట్లు చెప్పసాహసించితివి. అది శుద్ధతప్పు-అని వాదివకీలు పలుక, ఆ వాక్యములను విని ధనాత్మవాది నోరెత్తక ప్రూనువతె నిలబడెను. అంతట జడ్జిగారగు సద్గురువు రెండవ సాక్షియగు కళత్రాత్మవాదిని పిలువ నాజ్ఞాపించెను.

## 2 వ సాక్షియగు కళత్రాత్మవాది విచారణ

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడైన పరబ్రహ్మము యొక్క సాక్షాత్ స్వరూపమే అయి విలసిల్లుచున్న శ్రీ సద్గురు ప్రభుచక్రవర్తిగారైన జడ్జిగారి సన్నిధానమున ప్రతి వాదుల వకీలగు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి కళత్రాత్మవాదిని బిలిచి ప్రమాణము చేయించి ఈప్రకారముగ ప్రశ్నించెను.

ప్రశ్న :- నీవు ఆత్మను ఎపుడైన ఎఱిఁగియున్నావా ?

ఉత్తరము :- నా కళత్రము [భార్య] నే ఆత్మగా నెఱిఁగి యున్నాను.

ప్ర:- ఇందులకు ప్రమాణ మేదైన కలదా?

ఉ:- ప్రపంచములో భార్యయే తానని, తానే భార్యయని పెక్కురు తలంచుచున్నారు. ఇందుల కేలాటి సంశయము లేదు. ఇది అనేకులకు అనుభవమువందున్న విషయము. భార్యకంటె ప్రియమైన వస్తువు మఱియొకటి ముల్లోకములందును లేనే లేదని ఎన్నియో గ్రంథములందు పేర్కొనబడినది. కనుకనే ప్రియురాలిని శ్లాఘించి చెప్పు సందర్భము లెన్నియో కావ్యనాటకాదులందు కానవచ్చుచున్నవి. నావాక్యమును పరిపోషించుట కింతకంటె ప్రబల నిదర్శనమేమి కావలయును?—ఈ ప్రకారముగ ప్రతివాది వకీలు వేసిన ప్రశ్నకు సమాధానమును ఘోరమూఢబుద్ధి తెలిపి, తనకక్షిని బలపఱచ యత్నింప, వెంటనే వాదివకీలగు సూక్ష్మపార్త్వకాంశబుద్ధి లేచి ఆసాక్షిని ఈ ప్రకారముగ క్రాసుపరీక్ష చేయదొడగెను—

## వాదివకీలు క్రాసుపరీక్ష
## (Cross-examination)

ఓయీ ఘోరమూఢబుద్ధీ! నీవు సత్సాంగత్య మెప్పుడైన చేసినావా? సద్గ్రంథపఠనమును గావించితివా? కనుకనే అజ్ఞానపాశబద్ధుడవగు నీవు నీకు తోచిన లౌకిక దృష్టాంతములను ఇచ్చినావు. ఇవి విజ్ఞులకు ఆమోదయోగ్యములు

కావు. నీవాదము దుర్బలముగను, పసలేనిదిగను ఉన్నది. పారమార్థిక విచారణయను ఝంఝూమారుతమునందు నీ తార్కికోక్తులు పుల్లియాకులపగిది యెగిరిపోగలవు. ఎట్లనిన—

కేశకజ్జలధారిణ్యో దుఃస్పర్శాలోచనప్రియాః
దుష్కృతాగ్నిశిఖా నార్యోదహన్తి తృణవన్నరమ్.

కాటుకదిద్దిన కన్నులుగలస్త్రీలు చూచుటకు సుందరముగా నున్నను, తృణమును అగ్ని దహించివేయులాగున పురుషుని మోహావశమున దహించివేయుచున్నారు. (కావున వారికి అతిదూరమున నుండవలెను.)

కామనామ్నా కిరాతేన వికీర్ణా ముగ్ధచేతసః
నార్యో నరవిహంగానా మంగబంధన వాగురాః.

మన్మథుడను కిరాతుడు స్త్రీలను వలలనుపన్ని పురుషులను పక్షులను పట్టి బాధించుచున్నాడు. (కావున కడుజాగరూకులై యుండవలెను.)

జన్మపల్వల మత్స్యానాం చిత్తకర్దమ చారిణాం
పుంసాం దుర్వాసనా రజ్జుర్నారీ బడిశపిండికా.

జన్మమను తటాకమందు చిత్తమను బురదనీళ్ళలోపల సంచరించు పురుషులను చేపలను దుర్వాసనయను దారమునందు సంధించి, గాలమువైచి, స్త్రీలను ఎఱవేసి మన్మథుడను బెస్తవాడు పట్టి మోహాగ్నియందు పచన మొనర్చివైచుచున్నాడు.

దుఃఖశృంఖలయా నిత్యమలమస్తు మమస్త్రియా.

పురుషులకు సంకెళ్ళను బోలియుందురు స్త్రీలు. కాబట్టి జాగరూకులై యుండవలెను.

స్త్రియం త్యక్త్వా జగ త్త్యక్తం జగ త్త్యక్త్వా సుఖీభవేత్.

స్త్రీయొక్క తగులాటము వదిలెనేని జగత్తుయొక్క తగులాటము వదులును. జగత్తుయొక్క తగులాటము తీరెనేని మనుజుడు సుఖవంతుడు కాగలడు.

ఈ ప్రకారముగ యాజ్ఞవల్క్యోపనిషత్తు, యోగ వాసిష్ఠము మొదలైన ప్రామాణిక గ్రంథములు ఘోషించు చుండ ఓయీ! నీవేల వారను శ్లాఘించుచున్నావు? నీవు 'భార్య నేన'ని చెప్పుచున్నావా? లేక 'నా భార్య' యని చెప్పుచున్నావా? నాభార్యయని చెప్పుటవలన, భార్య నీకంటె వేఱుగానే యుండుటచే, ఆపై సంబంధమైన సుఖదుఃఖము అను నీవు తాదాత్మ్యాధ్యాసముచే అజ్ఞానమువలన అనవసర ముగ నీపై వేసుకొనుచున్న వాడవే యగుదువు పలువిధము లైన వ్యసనములు, చింతలు, యాతనలు, వాంఛలు స్త్రీల వలన నీకు కలుగుచుండుటచే వారలను పరమానందప్రద లని, సుఖదాత్రులని వచించుట కేవలము అవివేకమే యగును. మఱియు కళత్రమే ఆత్మయని పలుకుట కేవలము అసంగతమున్ను, ప్రమాణవిరుద్ధమున్ను, భ్రాంతిజన్యమున్ను

అగును. కావున, ఆ ప్రకారము చెప్పరాదు—అని వాదివకీలగు సూక్ష్మబుద్ధి యడుగగా, కళత్రాత్మవాది యను సాక్షి బదులు చెప్పక దొంగవలె మిణకరించుచు మొద్దువలె నిలిచెను. కోర్టు వారు వానిని అసమర్థుడని యెంచి బయటకు పంపివేసి, మూడవ సాక్షియగు పుత్రాత్మవాదిని పిలువనంపిరి.

## 3 వ సాక్షియగు పుత్రాత్మవాది విచారణ

నిత్యనిర్మల నిర్గుణ నిరాకార నిర్వికల్ప నిశ్చల పరబ్రహ్మముయొక్క సాక్షాత్ స్వరూపమే అయి వెలుగొందుచున్న శ్రీ సద్గురుప్రభు చక్రవర్తిగారైన జడ్జిగారి సన్నిధానమున ప్రతివాదుల వకీలగు ఘోరమూఢబుద్ధి యను వాడు లేచి పుత్రాత్మవాదిని పిలిచి 'సర్వశక్తిగల సద్గురు ప్రభువుయొక్క సాన్నిధ్యమున నిజముతప్ప మరేమియు పలుక'నని ఆతనిచే ప్రమాణము చేయించి ఇవ్విధమున నాతనిని ప్రశ్నించెను.

ప్ర:- నీ పేరేమి ?

ఉ:- నా పేరు పుత్రాత్మ.

ప్ర:- ఈ వ్యాజ్యమున సాక్షియైన ఆత్మ నెఱుగుదువా ?

ఉ:- పుత్రుడే ఆత్మయని యెఱుగుదును !

ప్ర:- పుత్రుడే ఆత్మయని యెట్లెఱిగినావు ?

ఉ:- ఆతడు సదానందమై యుండుటవలన.

ప్ర:- పుత్రుడు ఆనంద మెట్లగును?

ఉ:- పుత్రుడు లేనివాడు సదా దుఃఖము బొందుచున్నాడు. నాకు పుత్రుడున్నందువలననే ఎల్లప్పుడు సుఖముగ నున్నాను.

ప్ర:- పుత్రుడే ఆత్మయనుటకు ప్రమాణమేదైన చెప్పగలవా?

ఉ:- చెప్పగలను - వినుడు -

1. ఆత్మావై పుత్ర నామాసి పుత్రేణ లోకాన్ జయతి.

2. అపుత్రస్య గతిర్నాస్తి స్వర్గో నైవచ నైవచ
తస్మాత్పుత్రముఖం దృష్ట్వా భవేత్పశ్చాద్ధి తాపసః

3. పున్నామ్నో నరకాద్యస్మాత్ పితరం త్రాయతేస్వయం
తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువాః.

ప్రభూ! దేవరా! ఎట్టి వ్యసనము కలిగినను పుత్రుని జూచినంతనే అది తొలగిపోయి ఆనందము కలుగుచున్నది కదా! కాబట్టి పుత్రుడే ఆత్మ యగును.

ఈ ప్రకారముగ పుత్రాత్మవాది పలుకగా అంతట వాది వకీలగు సూక్ష్మసాత్వికాంశబుద్ధి లేచి ఆ ప్రతివాది సాక్షిని ఈ ప్రకారముగ క్రాసుపరీక్ష చేయదొడంగెను.

## వాదివకీలు చేయు క్రాసుపరీక్ష

ఓయీ! నీవు చెప్పిన ప్రమాణములు సరికావు శాస్త్ర వాక్యములను నీవు అపార్థము చేసికొనినావు. నీకు నిజముగా పుత్ర శబ్దమునకు అర్థము తెలిసియున్నచో మాంసాస్థి చర్మ రక్త మలజల సముదాయ మానుషాకార క్రిమి విశేషము లను అఖండ సచ్చిదానంద పరిపూర్ణ ఆత్మవస్తువుగా నీవు తలంపకుందువు. దేహాత్త్వ పరిశోధకులు చిరకాలము పరిశోధనలు చేసి ఈ శరీర మొక జడవస్తువేయని తేల్చి చెప్పివైచిరి. ఇది శుక్ల శోణితములయొక్క సంయోగము వలన ఏర్పడిన ఒకానొక పాంచభౌతిక పదార్థమే యగును. ఈ ప్రకారమైన మానవాకారమగు పుత్రుడనువాడు శుద్ధ చైతన్యస్వరూపు డెన్నటికిని కాజాలడు! కావున పుత్రుని జూచి ఆత్మయని భ్రమింపదగదు. యాజ్ఞవల్క్యోపనిషత్తునందు ఏమి వచింపబడినదో చూడుము—

అలభ్యమానస్తనయః పితరౌ క్లేశయేచ్చిరం
లబ్ధో హి గర్భపాతేన ప్రసవేన చ బాధతే.

తల్లిదండ్రులకు పుత్రుడులేని కాలమందు దుఃఖమును కలుగజేయును. ఒకవేళ కలిగినా, గర్భపాతమువలన, ప్రసవాదులవలన వారికి క్లేశమును తెచ్చిపెట్టును.

1. జాతస్య గ్రహరోగాది కుమారస్య చ ధూర్తతా
ఉపనీతేఽప్యవిద్యత్వ మనుద్వాహశ్చ పండితే.

2. యూనశ్చ పరదారాది దారిద్ర్యంచ కుటుంబినః
పుత్రదుఃఖస్య నాస్త్యన్తో ధనీచేన్మ్రియతే తదా.

పుట్టిన పిదప గ్రహబాధలచేతను, రోగబాధలచేతను, అల్లరిచేతను, దుస్సాంగత్యముచేతను, విద్య లేమిచేతను, దారిద్ర్యమువలనను పుత్రుడు తల్లిదండ్రులకు దుఃఖమునే గలుగజేయుచున్నాడు.

ఏవం నివిచ్య పుత్రేఽసౌ ప్రీతిం త్యక్త్వా నిజాత్మని
నిశ్చిత్య పరమాం ప్రీతిం వీక్షతే తదహర్నిశమ్.

"ఈ ప్రకారముగ వివేచించి పుత్రునిపై ఆసక్తిని విడనాడి ఆత్మయందే పరమప్రీతిని సదా యుంచవలెను"- ఈ ప్రకారముగ శ్రుతిస్మృతులు ఉద్ఘోషించుచుండ నీవు పుత్రుడే ఆత్మయని సుఖప్రదుడని యేల వాదించుచున్నావు? నీ అసత్య ప్రలాపముల నిక కట్టిపెట్టుము.

కొడుకుల్ పుట్టరటంచు నేడ్తురవివేకుల్ జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నే గతుల్
వడసెం? బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లెనే దుర్గతుల్?
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీకాళహస్తీశ్వరా.
(ధూర్జటి)

ఇంకను వినుము-నీవు పుత్రుని నేననుచున్నావా, లేక నా పుత్రు డనుచున్నావా? నా పుత్రుడన్నపుడు నీవు వేఱు పుత్రుడు వేఱు అగుటలేదా? మఱియు పుత్రుడు లేనివాడు

దుఃఖము నొందుచున్నాడని అంటివిగదా, నీపుత్రుడు క్షేమముగా నుండగోరి నీ వెంత తాపత్రయ పడుచున్నావు, ఎన్ని వ్యసనములను పొందుచున్నావు. పుత్రుడే తాను అని చెప్పిన వాక్యము సామాన్యుల గోలకే యగును. మఱియు పుత్రుని జూచినంతనే ఆనందము కలుగునని యంటివిగదా! నీకు ఆకలి అయినప్పుడుగాని, వ్యాధి సంభవించినప్పుడుగాని భోజనము, ఔషధములు లేకనే నీ పుత్రుని జూచినంత మాత్రముచేత అవి తొలగిపోవుచున్నవా?

పుత్రుడే ఆత్మయైతే పుత్రుడు పుట్టుటకు ముందున్ను, మరణించిన వెనుకనున్ను, అతడు ఇతరచోటులకు బోయియుండు కాలమందున్ను నీవు ఉంటివా లేదా? కాబట్టి పుత్రుడు ఆత్మ యెన్నటికిని కానేరదు.

ఈ ప్రకారముగ వాదివకీలు ప్రతివాది సాక్షియగు పుత్రాత్మవాదిని వాదమందు తూర్పారపట్టగా ఆవాదమునకు తట్టుకొనలేక యతడు మిణకరించుచు కోర్టునందు నిలబడెను. అపుడు జడ్జిగారు ఇతనిని అసమర్థుడని యెంచి అచ్చోటనుండి పంపివేయవలసినదిగా ఆజ్ఞయొసంగి నాల్గవ సాక్షియగు దేహాత్మవాదిని పిలువనంపించెను.

## 4 వ సాక్షియగు దేహాత్మవాది విచారణ

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండైన నిత్యనిర్మల నిర్గుణ నిరాకార నిర్వికల్ప నిశ్చల పరబ్రహ్మముయొక్క సాక్షాత్ స్వరూపమే అయి విలసిల్లుచున్న (శ్రీ) సద్గురు ప్రభు చక్రవర్తిగారైన జడ్జిగారి సాన్నిధ్యమున ప్రతివాదుల వకీలగు ఘోరమూఢబుద్ధి యనువాడు లేచి దేవాత్మవాదిని బిలిచి సర్వశక్తిగల సద్గురు ప్రభువుయొక్క సన్నిధానమున నిజముతప్ప మరేమియు పలుకనని అతనిచే ప్రమాణము చేయించి ఇవ్విధముగ అతనిని ప్రశ్నించెను—

ప్ర :- నీ పేరేమి?

ఉ :- నా పేరు దేహాత్మ.

ప్ర :- ఈ వ్యాజ్యమున సాక్షైన ఆత్మ నెఱుంగుదువా?

ఉ :- దేహామే ఆత్మయని యెఱుంగుదును.

ప్ర :- దేహామే ఆత్మయని యెట్లెఱింగినావు?

ఉ :- దేహాముండిననే సమస్త భోగభాగ్యములు అనుభవించుటకు వీలున్నని. కావున దేహామే ఆత్మయని నేనెఱుంగుచున్నాను.

## వాదివకీలు చేయు క్రాసుపరీక్ష

ఓయీ! ఈ దేహమును గ్రహించక పూర్వమున్ను, దేహము నశించిన వెనుకనున్ను నీవున్నావా? లేదా! ఉన్నావు. అట్టిచో ఈ దేహము నీ వెట్లగుదువు? మఱియు ఈ దేహము నీవైనచో ఎల్లకాలములందును దాని జ్ఞప్తి నీకుండవలెను. నిద్రలో దానిభావన నీకు లేదు. మరణ మూర్ఛాదులందును లేదు. అట్టి దేహము నీవెట్లు కాగలవు? కావున దేహమే ఆత్మయని నీవు వ్యర్థముగ ప్రగల్భములు పలుకుచున్నావు. అది శాస్త్రవిరుద్ధము, అనుభవ విరుద్ధము. మఱియు దేహము అపవిత్రమైనది. మలమూత్ర రక్త మాంసాదుల సంఘాతమే ఈ దేహము. అట్టి దేహము పవిత్రమగు ఆత్మ యెట్లు గాగలదు? మహనీయులు చెప్పు అనుభవ వాక్యములను వినుము—

> 'దేహోఽహమితి సంకల్పో మహాపాపమితి స్ఫుటమ్
> దేహోఽహమితి యజ్ఞానం తదేవ నరకం స్మృతిమ్.
>
> (తేజోబిందు-ఉప)

'నేను దేహమును' అను సంకల్పము మహాపాపకర మైనది. మఱియు 'నేను దేహమును' అను జ్ఞాన మేదికలదో అదియే నరకమని చెప్పబడినది.

> జాతం మృతమిదం దేహం మాతాపితృమలాత్మకం
> సుఖదుఃఖాలయా మేధ్యం స్పృష్ట్వా స్నానం విధీయతే.

—పుట్టునదియు, చచ్చునదియు, మాతాపితృమల స్వరూపమైనదియు, సుఖదుఃఖ నిలయమునగు ఈ దేహమును తాకినచో స్నానము విధింపబడినది.

నవద్వారమలస్రావం సదా కాలే స్వభావజం
దుర్గంధం దుర్మలోపేతం స్పృష్ట్వా స్నానం విధీయతే.

స్వభావముగ నిరంతరము తొమ్మిది ద్వారముల నుండియు మలము స్రవించుచున్నదియు, దుర్గంధయుతమైనదియునగు ఈ దేహమును తాకినచో స్నానము విధింపబడినది—అని మైత్రేయోపనిషత్తు పలుకుచున్నది.

ఇట్టి నింద్యమైన శరీరమును ఆత్మయని వచించుట కేవలము హాస్యాస్పదమేయగును. వాస్తవముగ మానవుడు దేహమెన్నటికిని కాడు. నిర్వికల్ప చిదాత్మయే యగును. కావున, 'దేహము నేను' అను అహంకారమును పారద్రోలి 'బ్రహ్మమునే నేను' అను నిశ్చయముకలవాడు మాత్రమే పరమశ్రేయమును బొందగలడు. దేహాహంభావము కలవాడు సంసారదుఃఖరూప గర్తమునబడి జనన మరణములను బొందుచు అత్యంతక్లేశమును బడయుచుండును.

వాదివకీలు కావించిన ఈ వాదనను విని దేహాత్మవాది మారుమాటాడక స్తబ్ధుడై నిలబడగా, అతడు అసమర్థుడని యెంచి జడ్జిగారతనిని కోర్టునుండి బయటకు పంపించివేసి తక్కినసాక్షులగు ప్రాణాత్మవాది మున్నగువారిని విచారింపదొడగెను.

# శివ సాక్షియగు ప్రాణాత్మవాది విచారణ.

నిత్య నిర్మల నిర్గుణ నిరాకార నిర్వికల్ప నిశ్చల పర బ్రహ్మముయొక్క సాక్షాత్ స్వరూపమే అయి వెలుగొందు చున్న శ్రీసద్గురుప్రభు చక్రవర్తిగారైన జడ్జిగారి సన్నిధాన మున ప్రతివాదుల వకీలగు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి ప్రాణాత్మవాదిని పిలిచి, 'సర్వశక్తికల సద్గురు ప్రభువుయొక్క సాన్నిధ్యమున నిజముతప్ప మఱేమియు పలుక'నని అతనిచే ప్రమాణము చేయించి ఇవ్విధముగ నాతనిని ప్రశ్నించెను—

ప్ర:- నీ పేరేమి? 

ఉ:— నా పేరు ప్రాణాత్మవాది. 

ప్ర:- నీవు ఆత్మ నెఱుంగుదువా? 

ఉ:— ప్రాణమే ఆత్మయని యెఱుంగుదును.



ప్ర:- ఇందులకు ప్రమాణమేదైన చెప్పగలవా?

ఉ:— 'అన్యోంతరాత్మా ప్రాణమయః' యనియు, "ప్రాణోహ పితా, ప్రాణోమాతా, ప్రాణోభ్రాతా, ప్రాణ స్స్వసా, ప్రాణ ఆచార్యః, ప్రాణోబ్రాహ్మణః"

అనియు శాస్త్రములు వక్కాణించుచు ప్రాణమే సమస్తమని బోధించుచున్నవి. మఱియు సర్వమున్ను లయించిన సుషుప్తికాలమందు ప్రాణము లయించకయుండుట ముఖ్యముగ గమనించదగియున్నది.

## వాదివకీలు చేయు క్రాసుపరీక్ష

ఓయీ! నీవాదము చాల పేలవముగా నున్నది. శ్రుతి, యుక్తి, అనుభవములచే నీ వాదన నిపుడు నేను ఖండించి వేయుచున్నాను. నీవు నా 'ప్రాణము'ని చెప్పుచున్నావు కదా, అపుడు నీవు వేఱు, ప్రాణము వేఱు అయియుండుటచే నీవే ప్రాణ మెట్లుకాగలవు?

న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ

అను కఠోపనిషద్వాక్యమును నీవు వినియున్నట్లైతే ఈ ప్రకారముగ ప్రేలకొందువు. 'మానవుడు ప్రాణముచే గాని, అపానముచే గాని జీవించుటలేదు. ఆ రెండింటికిని ఆధారభూతమైన మఱియొక దానిచేతనే (సచ్చిదానందాత్మ చేతనే) జీవించుచున్నాడు' అని శ్రుతిభగవతి ఎలుగెత్తి చెప్పుచున్నది. వాస్తవముగ ప్రాణవాయువు జడమైనది. దానికి స్వతః సత్త లేదు. ఆత్మయొక్క సత్తచేతనే అది జీవించుచున్నది. ప్రాణము పోయినప్పటికి జీవుడు నశింపక కర్మానుగుణ్యమగు అన్యదేహమును స్వీకరించుచున్నాడు. కావున 'నేను ప్రాణమును' అను వాక్యము నిరాధారమైనది. కొందఱు హఠయోగము నభ్యసించి, కుంభకమును జేపట్టి దీర్ఘకాలము ప్రాణవాయువు లేకనే జీవించుచుండుట కానబడుచున్నది. ప్రాణమే తానైనచో ఆ సమయమున వారు

ప్రతిని పొందియుండవలసినది గదా! అట్లు కాలేదేమి! కావున మనుజుడు ప్రాణమే తానెన్నటికిని కాడు.

ప్రాణమనునది ఆత్మకు ఒకానొక కోశము. కోశము వేఱుగాను ఖడ్గము వేఱుగాను ఉండునట్లే పంచకోశముల కంటె ఆత్మ భిన్నముగనున్నది. కావున ప్రాణము ఎన్నటికిని ఆత్మకాదు. ప్రాణమే తాను కానపుడు ఇక ప్రాణధర్మములగు క్షుత్పిపాసలు తానెట్లగును? కాబట్టి వాని యన్నిటి కంటె విలక్షణుడగు నిర్వికార నిశ్చల పరమాత్మయే వాస్తవముగ తానగును. ఈ సత్యమునే ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.

మఱియు ప్రాణమగు నీవు ప్రజ్ఞారూపమగు ఆత్మవై యుండినచో మనుజుడు గాఢనిద్రపోవుచున్నపుడు ఎవరైన జేబులోని వస్తువును అపహరించుకొని పోవుచుండగా నీవేల కనిపెట్టలేకున్నావు? కావున బయట వీచుచున్న గాలివలె నీవు జడస్వరూపమవు. వాస్తవముగ నిన్ను నీ వెఱుఁగలేవు. నీ కన్యమైనదానినిన్నీ ఎఱుఁగలేవు. అట్టి ప్రజ్ఞాశూన్యమగు నీవు ఆత్మ వెట్లు కాగలవు?

ఈ ప్రకారముగ వాదివకీలు ప్రతివాది సాక్షియగు ప్రాణాత్మవాదిని వాదమందు తూర్పారపట్టగా, ఆ వాదమునకు తట్టుకొనలేక యతడు మిణకరించుచు కోర్టునందు నిలబడెను. అపుడు జడ్జిగారతనిని కేవలము అసమర్థుడని యెంచి అచ్చోటనుండి పంపివేయవలసినదిగా ఆజ్ఞయొసంగి, ఆఱవ సాక్షియగు మనోమయాత్మవాదిని పిలువనంపించెను.

## 6 వ సాక్షియగు మనోమయాత్మవాది విచారణ

శ్రీ సద్గురుప్రభు చక్రవర్తిగారైన జడ్జిగారి సన్నిధాన మున ప్రతివాది వకీలగు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి మనోమయాత్మవాదిని బిలిచి 'సర్వశక్తిగల సద్గురు ప్రభువు లొంక్క సాన్నిధ్యమున నిజముతప్ప అన్యమేమియు పలుక' నని అతనిచే ప్రమాణము చేయించి ఇవ్విధముగ నాతనిని ప్రశ్నించెను.

ప్రశ్న :-నీ పేరేమి?

ఉత్తరము:- నా పేరు మనోమయాత్మవాది.

ప్ర :- నీవు ఆత్మ నెఱుఁగుదువా?

ఉ :- మనస్సే ఆత్మయని యెఱుఁగుదును.

ప్ర :- ఇందులకు ప్రమాణ మేదైనా చెప్పగలవా?

ఉ :- చెప్పలేకేమి? ఎన్నియో ప్రమాణములుకలవు-వినుడు-

1. అన్యోఽన్తరాత్మా మనోమయః

2. మనసా కల్పితం సర్వం మనసా పరిపాలితం
మనసా సంస్మృతం తస్మాత్ మన ఏవాస్తి కారణమ్.

ఇంతియేకాదు. నేనులేని సుషుప్తికాలమున జగత్తు లోపక, నేను ఉండు జాగ్రత్స్వప్న కాలములందు జగత్తు తోచుచున్నదిగదా. కాబట్టి సమస్తము నేనే. నేనే. ఆత్మను

మనోమయాత్మవాదియొక్క ఆ వాక్యములను విని వాదివకీలాతనిని ఈ ప్రకారముగ క్రాసుపరీక్ష చేయదొడగెను.

## వాదివకీలు చేయు క్రాసుపరీక్ష

నీవే ఆత్మ అయితే 'నా మనస్సు' అని జీవుడేల చెప్పుచున్నాడు? అప్పుడు మనస్సు వేఱు, తాను వేఱు కాలేదా? ఇక నేనడుగు ప్రశ్నలకు సమాధానమిమ్ము-

ప్ర :- నీ తల్లి యెవరు?

ఉ :- అవిద్య.

ప్ర :- నీ వృత్తి యేమి?

ఉ :- శ్రోత్రాదీంద్రియములను సాయముగా గైగొని శబ్దాది విషయములను గూర్చి చింతించుట.

ప్ర :- ఈ వివాదసాత్తగు ఆత్మ నీకేలాగు దొరికినది?

ఉ :- నా తల్లియగు అవిద్యమూలకముగ నాకు లభించినది.

ప్ర :- ఓ మనోమయాత్మవాదీ! నీ స్వరూపము చిత్తుగాదు, జడముకాదు, రెండు కలిసినదికాదు. చిత్తైనచో వికారము లేకుండవలెను. అట్లు లేదు. జడమైనచో కదలక ఉండవలసియుండును. అట్లు లేదు. చిజ్జడములు రెండును కలిసియుండుట ప్రకాశాంధకార

ముల కలయికవలె అసాధ్యమేయగును. వా
వాస్తవముగ లేనిదానవు. అట్టినీవు ఆత్మయొ

అని ఈ ప్రకారముగ వాదివకీలు చేయు
తుకు తట్టుకొనలేక మనోమయాత్మవాది విచారించు
చుండ, కోర్టువారతనిని అసమర్థుడని యెంచి అచో
లాగివారవైచి తక్కిన విజ్ఞానమయ, ఆనంద
వాదులను పిలువ నాజ్ఞాపించిరి.

## 7 వ సాక్షియగు విజ్ఞానమయాత్మవాది విచా

శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడై
బ్రహ్మముయొక్క సాక్షాత్ స్వరూపమే అయి విల
శ్రీసద్గురు ప్రభు చక్రవర్తి గారైన జడ్జిగారి సన్ని
ప్రతివాది వకీలగు ఘోరమూఢబుద్ధి యనువాడు
మయాత్మవాదిని పిలిచి సర్వశక్తిగల సద్గురు ప్రభు
సాన్నిధ్యమున నిజముతప్ప అన్యమేమియు పలుకన
ప్రమాణము చేయించి ఇవ్విధముగ నాతనిని ప్రశ్ని

ప్ర :- నీ పేరేమి?

ఉత్తరము :- విజ్ఞానమయాత్మవాది.

ప్ర :- నీ తండ్రి పేరు?

ఉ :- అహంకారము.

ప్ర :- నీవు ఆత్మ నెఱుఁగుదువా?

ఉ :- నేనే ఆత్మ, నన్ను వినాగా ఆత్మయను వస్తువే లేదు.

ప్ర :- ఇందులకు ప్రమాణమేదైనా చెప్పగలవా?

ఉ :- అన్యోన్తరాత్మా విజ్ఞానమయః; విజ్ఞానమానందం బ్రహ్మ-మున్నగు వాక్యములే ప్రమాణములు.

ప్ర :- యుక్తి ఏదైన చెప్పగలవా?

ఉ :- భువినేలు నరాధిపునియొక్క ఆజ్ఞప్రకారము జనులు నడచుకొనునట్లును, సర్వేంద్రియములును నా యను మతి ప్రకారము నడుచుకొనుటయే యుక్తి.

ఆ వాక్యములను వినగానే సాత్వికాంశబుద్ధియను వాదివకీలు లేచి కోర్టువారికి నమస్కరించి సదరు సాక్షిని ఈ ప్రకారముగ క్రాసుపరీక్ష చేయవాడగను.

## వాదివకీలు చేయు క్రాసుపరీక్ష

ప్ర :- నీ వెవరవు?

ఉ :- విజ్ఞానమయాత్మవాదిని.

ప్ర :- నీ తాతగారి పేరేమి?

ఉ :- ఋషిమూలము, నదిమూలము విచారించగూడదు.

ప్ర :-నీ తల్లి యెవరు?

ఉ :- అవివేకచూడామణి.

ప్ర :-నీవు సదాచేయుచుండు పనులేవి?

ఉ :- చూచుట, వినుట, తాకుట, రుచిచూచుట మొదలగు ఇంద్రియ వ్యాపారములే నా పనులు.

ప్ర :- నేత్రాదీంద్రియములు చెడిపోయినకాలమందు ఆ పనులను నీ వెట్లు చేయగలవు? కావున పైన వివరించిన పనులను నేను చేయుచున్నానని నీ వెట్లు చెప్పినావు? మఱియు నీవే ఆత్మ అయితే నాయిల్లు, నావాకిలి, నా బుద్ధి అని చెప్పుచుండుటవలన, బుద్ధి వేఱు, నీవు వేఱుగా నున్నావుగదా. అట్టిచో బుద్ధి (విజ్ఞానమయుడు) యగు నీవు ఆత్మవు ఎట్లు కాగలవు?

ఉ :- ఇంతవరకు లోకమందు నీవెవరవని నన్నడిగినవారే లేరు. నీవీదినమున నాగుట్టు బయటపెట్టి నాశనముచేసినావు. నా యోగ్యత చెడగొట్టినావు. నే నెటువంటి

కాడనో మీ కేమి తెలియును? నేను చేయని యాగములే లేవు. నా యోగ్యతను తెలిసికొనుటకు నాకు సమాన మైన వారికే తప్ప అన్యులకు సాధ్యపడదు. ఈ కోర్టు నందున్న ప్రతిపక్షులుగాని మీరుగాని నా వాస్తవ స్వరూపము నెఱుంగరు. నేను సర్వజ్ఞుడను. నేను చేయని, చేయజాలని పనే లోకములో లేదు. నేననుభ వింపని సుఖములే లోకమున లేవు.

ప్ర :- ఓయీ! నేనడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానము నీయక నిన్ను నీవు ఊరక పొగడుకొనుచున్నావు. ఇంతవఱకు నిన్నవరకును కోర్టుముందు విచారణకు తేనందున నీకింత అహంకారము బలిసిపోయినది. నీగుట్టు మరల ఇప్పుడే బయటపెట్టెదను చూడుము. ఈశ్వ రాజ్ఞవలనను, భగవన్నియతిచేతను జగత్తులోని సమస్తక్రియలు జరుగుచుండ అవివేకులు తమవలననే సమస్తము జరుగుచుండునని విఱ్ఱవీగుచుందురు. నేనే కర్తనని చెప్పుటవలన లేనిపోని కర్తృత్వమును నీవు నీయం దారోపించుకొనుచున్నావు. వాస్తవముగ నీవు చైతన్యమవు కావు. మాయవలన కల్పింప బడినస్థూలశరీరధర్మములును, సూక్ష్మశరీరముయొక్క షడ్భావవికారములును, ఇంద్రియములయొక్క వికా రములును, ప్రాణముయొక్క చలనత్వమును, ఆత్మ యొక్క ప్రకాశవంతమైన జ్ఞానమును అంతయు చేర్చి నేను కర్తనని చెప్పుచున్నావు. ఇట్లు చెప్పవచ్చునా?

జ్ఞానేంద్రియైస్సహాబుద్ధిర్విజ్ఞానమయకోశ - అనుపైంగ లోపనిషద్వ్యాఖ్యానుసారము బుద్ధియు జ్ఞానేంద్రియము లైదునుగూడి విజ్ఞానమయకోశ మనబడును. అంతియే కాని అది ఆత్మకాదు. అది దృశ్యవర్గములో చేరినది. జడమైనది!

అని ఈ ప్రకారముగ వాదివకీలు క్రాసుపరీక్ష చేయగా తనగుట్టు బయటపడినందున ప్రత్యుత్తరమీయలేక విజ్ఞానమయాత్మవాది స్తబ్ధుడై మిణకరించి చూచుచుండ కోర్టువారతనిని అసమర్థుడని నిశ్చయించి బయటకు లాగివైచిరి. తదుపరి జడ్జిగారు ఆనందమయాత్మవాది. శూన్యవాది మున్నగువారిని పిలువ నాజ్ఞాపించిరి.

## 8 వ సాక్షియగు ఆనందమయాత్మవాది విచారణ

శ్రీసద్గురు ప్రభుచక్రవర్తిగారైన జడ్జిగారి సన్నిధానమున ప్రతివాదివకీలగు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి ఆనందమయాత్మవాదిని పిలిచి సర్వశక్తిగల సద్గురు ప్రభువుయొక్క సాన్నిధ్యమున సత్యమే పలుకుదునని అతనిచే ప్రమాణము చేయించి ఈ ప్రకారముగ నాతనిని ప్రశ్నించెను.

ప్రశ్న :- నీ పేరేమి?

ఉత్తరము :- ఆనందమయాత్మవాది.

ప్రశ్న :- ఆత్మను నీ వెఱుంగుదువా?

ఉ:- ఆనందమయుఁడవగు నేనే ఆత్మ నన్ను వినాగా వేఱు ఆత్మ లేదు.

ప్ర:- ఇందులకు ప్రమాణమేదైన చెప్పగలవా?

ఉ:-అన్యోఽన్తరాత్మా ఆనందమయః...మున్నగు వాక్యములే ప్రమాణములు.

ప్ర:- యుక్తి ఏదైన చెప్పగలవా?

ఉ:- సమస్త ప్రాణికోట్లును సుషుప్తి సుఖము కొఱకు చాప, దిండు మొదలైన సాధనములను వెతకుకొనుట లేదా! ఇంతకు మించి వేరొక యుక్తి ఏమి కావలెను? పగలంతయు పనిచేసి రాత్రి ప్రతివారును నన్నాశ్రయించ వలసిందేగదా?

ఆ వాక్యములను వినగానే సాత్త్వికాంశబుద్ధియను వాదివకీలు లేచి కోర్టువారికి నమస్కరించి సదరు సాక్షిని ఈ ప్రకారముగ క్రాసుపరీక్ష చేయనారంభించెను.

ఓయీ! నీవు చెప్పిన స్థితి ఆనందఘనమగు ఆత్మస్థితి కాదు. అది దృశ్యవర్గములో చేరిన ఆనందమయ కోశము యొక్క స్థితి. దృశ్యవస్తువు ఏ కాలమందును స్థిరము కాదు. కావున ఆనందమయకోశమును అవిచ్ఛిన్నమైనది కాదు మఱియు అది ఏకదేశమై కలుగు ఆనందము. అవస్థాత్రయ వికారములలో చేరినట్టిది. వాస్తవమగు ఆత్మానందము అట్టిది కాదు. ఆ యానందము.

1. తత్ బ్రహ్మ తాపత్రయాతీతం, షట్కోశ వినిర్ముక్తం, షడూర్మి వర్జితం, పంచకోశాతీతం, షడ్భావ వికారశూన్యం...

2. నిర్వికల్ప మనంతం చ హేతు దృష్టాంత వర్జితం-మున్నగు శ్రుతివాక్యములనుబట్టి నిర్వికారమైనది. దృశ్యాతీతమైనది.

ఈ ప్రకారములైన వాదివాక్యములను వినికోర్టువారు ఇంతకు మునుపు ప్రతివాది తరపున సాక్షి చెప్పినవాక్యములు అసంగతములని యెంచి ఆతనిని బయటకు నెట్టివైచి ప్రతివాది తరపు మరొక సాక్షియగు శూన్యాత్మవాదిని పిలువనంపించి పూర్వవిధముగనే ప్రశ్నింప, వాడు శూన్యమే ఆత్మయని వాదింపదొడంగెను.

వెంటనే వాదివకీలు లేచి శూన్యమే ఆత్మయైనచో ఆ శూన్యమును దెలిసికొనువాడొకడుండవలెను గదా యనియు, సుషుప్తినుండి మేలుకొనిన పిదప 'నేను హాయిగా నిద్రించినాను' అని చెప్పగల్గుటచే ఆ సుషుప్తి సమయమున గూడ ఒకానొక ప్రజ్ఞావస్తువు మేలుకొనియే యున్నదనియు సుషుప్తిని సాక్షిగా గమనించుచున్నదనియు స్పష్టమగుచున్నదని, కాబట్టి శూన్యమున్ను దృశ్యమగుటచే అది ఆత్మ యెన్నటికిని కాదనియు గంభీరముగ వాదింప, శూన్యాత్మ వాది కిక్కురుమనక నిలబడియుండ, ఆతడు అసమర్థుడని యెంచి కోర్టువారు వానినిగూడ బయటకు సాగనంపిరి.

# వాదితరపు సాక్షుల విచారణ

## 1 వ సాక్షియగు వివేకుని విచారణ

ప్రతివాదితరపు సాక్షులగు ధనాత్మవాది, పుత్రాత్మవాది, దేహాత్మవాది మొదలగు యెనిమిదిమందిని విచారించిన పిదప శ్రీ సద్గురుప్రభు చక్రవర్తిగారైన జడ్జిగారు ఇక వాది తరపు సాక్షులను విచారించదలచినవాడై వారలను పిలువనంపించి, మొట్టమొదట వివేకుడను ప్రథమసాక్షిని కోర్టులోపలకు రప్పించెను.

అతడు లోనికిరాగానే అతిసూక్ష్మగ్రాహియగు సాత్వికాంశుడును వాదివకీలు లేచి వాదితరపు మొదటి సాక్షియగు వివేకుడనువానిని కోర్టువారిముందు నిలబెట్టి అసత్యము చెప్పనని ప్రమాణము చేయించి, నా తరపు సాక్షులను నే నడుగవలసిన మాటలేవియు లేవని వచింప, అంతట ప్రతివాది వకీలగు ఘోరమూఢబుద్ధి లేచి వివేకుని యిట్లు ప్రశ్నింపదొడగెను—

ప్రశ్న :- నీ పేరేమి?

ఉత్తరము :- వివేకుడు.

ప్ర :- నీ వెవని కుమారుడవు?

ఉ :- తత్త్వపరిశీలుని కుమారుడను.

ప్ర :- నీవు ఆత్మ నెఱుఁగుదువా?

ఉ :- సలక్షణముగా నెఱుగుదును.

ప్ర :- ఆత్మ నెఱుఁగుటకు లక్షణ మెందుకు?

ఉ :- అది అత్యావశ్యకము.

ప్ర :- ఆ లక్షణమున కేమిపేరు?

ఉ :- దానికి భాగత్యాగలక్షణమని పేరు.

ప్ర :- దానిని వివరించి చెప్పుము?

ఉ :- "సోఽయం దేవదత్తః" - ఆ దేవదత్తుడే వీడు - అను వాక్యముయొక్క వాచ్యార్థమందుఒక భాగమగు సః, అయం-అనెడు దేశకాలములను తొలగించి మఱొక భాగమగు దేవదత్తుడను వ్యక్తిని త్యజించక గ్రహించుట భాగత్యాగలక్షణమని పేరు. అట్లే దేహేంద్రియ విశిష్టాత్మయందు దేహేంద్రియాదులను "నేతి నేతి" (ఇది కాదు, ఇది కాదు) మున్నగు వాక్యముల ద్వారా తొలగించి శేషించిన చిద్రూపాత్మను గ్రహించవలసియున్నది. కావున ఆత్మ నెఱుఁగుటలో భాగత్యాగ లక్షణ మత్యావశ్యకమై యున్నది.

ప్ర :- దీనికి యుక్తి యేమి?

ఉ :- పంచభూతములవలెనే శ్రోత్రాది యింద్రియములు లున్ను జడరూపములే. అంతఃకరణమున్ను జడమైనదే. ఏలయనగా సుషుప్తియందది లయించిపోవు చున్నది. ఓత్తు(ఆత్మ)కెప్పుడును లయభావము లేదు, అగ్నిసంబంధమువలన తృణకాష్ఠాదులుఅగ్నిరూపములుగా కనబడురీతి ఆత్మయొక్క కల్పితసంబంధముచే పంచకోశములు చిద్రూపాత్మవలె తోచుచున్నవి. పంచకోశములను జీవుడు నాది నాదియని యేలుగుట వలన అవి దృశ్యరూపములై, జడములై, అనాత్మస్వరూపములై యున్నవి.

ప్ర :- ఆ యాత్మకు కర్తృత్వాది సంసారము కలదా, లేదా?

ఉ :- ఎన్నడును లేదు.

ప్ర :- ఇందులకు ప్రమాణములేవైన చెప్పగలవా?

ఉ :- లెక్కలేనన్ని చెప్పగలను- "నాహంకర్తా నైవభోక్తా ప్రకృతేస్సాక్షిరూపతః, మత్సాన్నిధ్యాత్ప్రవర్తన్తే దేహాద్యా అజడా ఇవ, స్థాణున్నిత్యస్సదానందశ్శుద్ధో జ్ఞానమయోఽమలః, ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీ న సంశయః. బ్రహ్మైవాహం - సచ్చిదానందరూపం.

నాహం దేహో జన్మమృత్యూ కుతో మే
నాహంకార క్షుత్పిపాసే కుతో మే

నాహం చేతశ్శోకమోహౌ కుతో మే
నాహం కర్తా బంధమోక్షౌ కుతో మే.

అని సర్వసారోపనిషత్తు ఘోషించుచున్నది. ఆత్మ కర్త కాదు, భోక్త కాదు, కేవల చిదానందస్వరూపమే యని ఆయా శ్రుతులు ఏకకంఠమున వక్కాణించుచున్నవి.

ప్ర :- ఆత్మయను సొత్తు సత్తా అసత్తా?

ఉ :- ఆత్మ ఏ కాలమందును అసత్తు కానేరదు. అది సత్తే.

ప్ర :- కారణమేమి?

ఉ :- (దృశ్యము) అంతయూ నశించినప్పటికిని ఆత్మ నశింపదు. అందుచేత.

ప్ర :- ఇందులకు ప్రమాణమేమి?

ఉ :- 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్'. అని ఛాందోగ్యోపనిషత్తు వచించినరీతి సృష్టికిపూర్వమును ఆత్మ యొకటియే వెలయుచున్నది. మఱియు-

స్వప్నాంతం జాగరితాంతం చోభౌ యేనానుపశ్యతి
మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి.

అను కఠోపనిషద్వాక్యరీతిగా జాగ్రత్స్వప్నసుషుప్తులను మూడవస్థలయందును సాక్షిగా ఆత్మ ప్రకాశించుచు కాలత్ర

యము లందును సద్రూపముగ వర్తించుచున్నది. అట్లే చిద్రూపముగను, ఆనందరూపముగనుగూడ వెలయుచున్నది.

ఈ ప్రకారముగ వాది సాక్షియగు వివేకుడు వచించిన వాక్యములను జడ్జిగారు విని ప్రతివాదివకీలగు ఘోర మూఢబుద్ధియగు వానిని జూచి "నీవు చేయు క్రాసుపరీక్ష వలన, బియ్యమును దంచదంచ తెలుపగునట్లు, నీ గుట్టు బయట పడుచున్నది. కావున ఇక నీ ప్రశ్నలను చాలింపుము" అని పలికి వాదిసాక్షి యగు వివేకుని యోగ్యతకు మెచ్చి వివాదము ముగియునంతవఱకు వాదియగు ముముక్షువునకు సహాయముగ నుండుమని ఆతనికి జెప్పి ఇక వాదితరపు రెండవ సాక్షియగు వైరాగ్యుని పిలువనంపించెను.

# జడ్జిమెంటు

వాదితరపు సాక్షియగు వివేకుని విచారించిన పిదప, (వాదితరపు) తక్కిన సాక్షులగు వైరాగ్యుడు, శముడు, దముడు మున్నగువారినిగూడ విచారించి, వారిసాక్ష్యములను గూడ గైకొని, శ్రీ సద్గురుప్రభుచక్రవర్తిగారైన జడ్జిగారు, ఇక కాలయాపన చేయక, పరిస్థితిని చక్కగా ఆకళింపు చేసికొనినవాడై, ఇరుపక్షముల బలాబలములను పరిశీలించి ఎవరి పక్షమున న్యాయమున్నదో లెస్సగ యోచించి, తన జడ్జిమెంటును ఈ క్రింది ప్రకారముగ చెప్పివైచెను—

ముముక్షువను వాది తన వివాద పత్రములో పాటు పొందుపఱచిన ఉపనిషదాది ప్రమాణములను బట్టియు, వాది తరపు సాక్ష్యమిచ్చిన వివేకాదుల స్టేట్ మెంటులను బట్టియు, ఆత్మయనుసొత్తు కేవలము ముముక్షువునకు జెందిన దేయని ముమ్మాటికిని స్పష్టపడుచున్నది. సదరు సొత్తును అజ్ఞాన సహాయముచే కామాది ప్రతివాదులు అనాదికాలముననే దొంగిలించి, దానిపై నేటివఱకు తమ హక్కుభుక్తములను చలాయించుచున్నారు. ఆత్మయను సొత్తు తమకు జెందినదే యని ప్రతివాదులు గావించిన వాదములో ఏమాత్రము పస కన్పించుటలేదు. అందువలన వారి వాదములతో నేనేకీభవించుటలేదు.

# డిక్రీ

ప్రతివాదులైన కామాదులు తాము వాది (ముముక్షువు) నుండి అపహరించిన ఆత్మీయమను సొత్తును తత్క్షణమే అతనికి స్వాధీనము చేసివేయవలెను. మఱియు ఆతడు కోర్టు నష్టపరిహారమును కోర్టు ఖర్చులతో సహా చెల్లించి తమ దురాగతము నకు క్షమాపణ వేడుకొనవలెను. ఈ దినము మొదలుకొని ముద్దాయిలగు కామాదులు యావజ్జీవ కారాగార శిక్ష అనుభవింపవలెను.

సత్యమేవ జయతే నానృతమ్.

# మోక్షసాధన రహస్యము

వెల రు. 12-00

మోక్షప్రాప్తికై యెట్టి సాధనల నవలంబించవలెనో ఇందు తేటతెల్లముగ వివరింపబడినది. ముముక్షువులకు అత్యావశ్యకమైన గ్రంథము.

పుస్తకములు కావలసినవారు

యీ క్రింది అడ్రసుకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

మేనేజరు

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీ కాళహస్తి

చిత్తూరుజిల్లా.



